సంపుటము 4] జూన్, 1918 [సంచిక 12

# బాలమిత్ర

## ముత్యములు కలుగు విధము



మలాఖి 3 అధ్యాయము 17 వచనములో దేవుడు ఆయన ముత్యములనుగూర్చి మాటలాడుచున్నాడు. "నేను నియమింపబోవు దినము రాగా వారు నావారై నా స్వకీయ సంపాద్యమై యుందురు" అని చెప్పుచున్నాడు; నక్షత్రములు చాల అందముగా యుండినను అవి దేవుని యొక్క ముత్యములుగావు. దేవుని యొక్క ముత్యములు మనుష్యుల యొక్క ఆత్మలే. ఒక ముత్యము కలుగు విధముగా మనుష్యుని యొక్క ఆత్మకూడ చక్కగా కలుగుచున్నది. ముత్యము ఒక చిప్పలో కలుగుచున్నదని ఒకవేళ మీకు తెలియవచ్చును. అది యెట్లు కలుగుననగా చిప్పలోపల పురుగువంటి జంతు వొకటి యుం

గును. దాని దేహము చాల మెత్తగావుండును. అది యితర జంతువులవలెనే జీవించును. ఒకానొక పర్యాయము చిప్ప లోపల రాయిపడును. అప్పుడు దానికి చాలనొప్పి కలుగును అప్పుడు అవి ఆ రాళ్లను బైటకు త్రోసివేయుటకు చాల ప్రయాసపడును గాని ఆ రాయిని బైటకు త్రోయుటకు వీలులేకపోవును. అందువలన ఆ రాళ్లు చిప్పలోపలనే నిలిచి పోవును. అప్పుడు ఆ పురుగు అటు యిటు కదలక ఆచోటనే నెమ్మదిగా నిలిచిపోవును. అపుడు దానిలో యొక ఆశ్చర్య మైన మార్పు కలుగును. ఒక విధమైన పాలువంటి నీరు ఆ పురుగునుండివచ్చి ఆ రాయిచుట్టు కమ్ముకొనును. గాన ఆరాయి ఒక చక్కని తెల్లని ముత్యమువలె మారిపోవును. బాధ కలుగజేసిన యిటువంటివస్తువునుండి చక్కనిముత్యము కలిగెను. తరువాత యిది మనుష్యులకంట బడినపుడు అది యొక రాజు కిరీటములోగాని లేక ధనవంతులయొక్క మెడ లలోగాని ఆభరణముగా ధరింపబడును.

ఆ విధముగానే దేవుడు యొక చక్కని ఆత్మను కలుగజే యుచున్నాడు. యేమైనా కష్టనష్టములు, ఉపద్రవములు వచ్చి నప్పుడు వాటిని తీసివేయవలెనని మనము దేవుని ప్రార్థించు చున్నాము; గాని దేవుడు వాటిని తీసివేయుటలేదు. ఆ విధముగా వదలివేయుచున్నాడు. మనము యీ బరువులను

మోసికొని నెమ్మదిగా నుండుటకై మనకు బోధించుచున్నాడు. రానురాను అది అంత బరువుగా నుండదు. ఆయనయొక్క దయచేత యిటువంటి కష్టములద్వారా మనయొక్క జీవితము మారిపోవును. అప్పుడు యీ ఉపద్రవము ఒక భాగ్యముగా కనుబడుచున్నది. యెహోవా దానినికనిపెట్టి సంతోషించి ఒకనాడు ఆ యాత్మను తనయొక్క కిరీటముకొరకు తీసికొనును.

---

## ఫలహార కీర్తన

చాయ : "బీదపోషణ సాధుభూషణనాథుడా ఘనవందనం" వలె

అందమగు నీ మందిరంబున - విందుసోపల్ నొందుడీ ॥

1. ఇందు గూడిన బృందమునకు - అందమగు ఫలహారముల్
   చందమలరగ నందజేసిన - వందనార్హుల బొందుచే ॥ అం ॥
2. చెలిమిచేమహావిలువగలయీ - పలువిధంబగుఫలంబులర్గొదిన
   కలిమి చేతను కాంక్షదీరగ - పిలిచినారను ప్రేమిచే ॥ అం ॥
3. పప్పు బెల్లము చిప్పకొబ్బరి - చప్పరించుచు దినను ఈ
   అప్పములను ఆశదీర - నప్పగించిరి నెమ్మిచే ॥ అం ॥

4. అక్కరోనిట వక్కయాకులు - చిక్కి నీ దినంబున
పక్క పక్కన నవ్వుచుఁ - పుక్కిట నూరించనై ॥ అం ॥
5. మందహాసపు మాటలచే - విందునొసగిన వందితుల
డెందముల రంజింపజేయుచు - నందరైక్యమైత్రిచే ॥ అం ॥
6. ఆడుటకును పాడుటకును - వీడు కొలిపిన వీరినిఁ
సాదరంబున నాదరించిన - సోదరుల వందించుచు ॥ అం ॥

---

# ప్రతిఫలము

సుందరి, నయోమియను బాలికలు యిద్దరు స్నేహితులుగా నుండిరి. వీరు యిద్దరు కలిసి తమ ఫోటోను తీయించుకొని తమతమ యిండ్లలో నుంచుకొనిరి. కొంతకాలమునకు మరియు అనునామె సుందరికి స్నేహితురాలయ్యెను. ఆమెకు అసూయ మెండు. అందుచే సుందరి, నయోమీలు కలిసి తీయించుకొన్న పటమును జూచినపుడెల్ల యీమెకు కోపము వచ్చుచుండును. ఒకనాడు తన పగను అణచుకొనలేక సుందరి గదియందు నుండిన పటమును తీసి, నేలపై వేసి కొట్టి, దానిని వేయి ముక్కలుగా చేసెను. నయోమిని ద్వేషించుమని సుందరితో పలుమారు చెప్పుచుండును. సుందరియు బేలయై యీమె

మాటలను వినుచుండెను. మరియు యొక్క జన్మదినమురాగా సుందరి ఆమెకు ఒక చక్కని వెలగల అద్దమును బహుమతి చేసెను. మరియు మిగుల సుప్పొంగుచు దానిని తన గది లోని కిటికిలో నుంచి ప్రతిదినము తన ప్రతిబింబమును ఆ పెద్ద యద్దములో జూచుకొనుచుండెను. తాను పటమును పాడుచేసిన కొన్నిదినములకే కిటికిలోనున్న మరియు అద్దము గాలికి క్రిందపడి పదివేలముక్కలు అయ్యెను. తాను చేసిన కీడుకు ప్రతికీడు యెట్లు వచ్చెనో చూడుడి. ఇతరులు మనకు యేమి చేయవలెనని కోరుదుమో మనమును వారికి అట్లే చేయవలెను.

---

# కనకమ్మ, వెలగపండు

తల్లి :—“కనకా! ఎందుకీదినము ఇంటిలోనే ఉన్నావు? ఆహా ఎంత బాగున్నవి బైట, చూడు సూర్యుడెంత చక్కగా నున్నాడో! ఆ పక్షులుచూడు ఏలాగు క్రిందకనిపెట్టుకొని యున్నవి!”

కనక :—“నేను వెళ్లను. నా కిష్టములేదు” అని మాడ్చు ముఖముతో ఆవంకజూచుచు అనెను.



తల్లి:—ఎందుకు మీరిద్దరు జతగదా! నిన్న ఉదయము బాగుంటిరే ఇంతలో ఏమి పుట్టినది?

కనక:—మేరీని చూచుటకు నా కిష్టములేదు. నేనంటే దాని కిష్టములేదు.

తల్లి:—మేరీ ఏమి చేసినది?

కనక:—ఏమి చేయలేదు నేనే జేసినాను. ఎప్పుడూ నేనే చేస్తుంటాను ఎవరూ చేయరు?

తల్లి:—ఏమి జరిగిందే, చెప్పరాదా?

కనక:—నిన్న ప్రొద్దుట చెట్టుమీదనుంచి ఒక మంచి వెలగపండు పడినది. మేరీ కది దొరికినది అది ఇద్దరము పంచుకోనవలెనని మేరీ అన్నది. గాని నాకే కావలెనని అంతా తీసికొన్నాను. గనుక మాటలాడడము లేదు, నాకు బాగాలేదు.

తల్లి:—సరే, అందుకు నీకు బాగా లేకపోతే మేరియొద్దకు బోయి, నిన్న జరిగినదానికి విచారముగా నున్నదని చెప్ప రాదూ, అది చాలమంచిది. వెంటనే మరచిపోవును.

కనక నెమ్మదిగా మేరి ఉన్న చోటికి పోయెను. పోవుచుండగా సరిగా తన ముందటనే ఒక మంచి వెలగకాయ దొరికినది. దానిని తీసికొనివెళ్లి, మేరి చేతిలోబెట్టి "మేరీ యిది నీది నిన్న చేసినదానికి నాకు నిండ విచారము" అని చెప్పెను.

---

# ప్రకృతి పాఠములు

## 44 వ పాఠము

## హస్తము

(గతసంచిక శేషము)

జంతు కోటియంతటిలో చేయిగలవాడు మానవుడొకడే. కోతికి చేతివంటి సాధనములున్నవి గాని అది చేయు పనులను గుర్తించినయెడల నీవు నీ చేతినెంత చక్కగాను లాఘవముగా నుపయోగింపగలవో అట్లు అది చేయనేరదని వెంటనే చూడవచ్చును.



చేయి బహు చిత్రమైన సాధనమని యెందురు కాని బహు చిత్రమైన యంత్రంబనిన బాగుండునని తలంచెదను. ఒక సాధనము చేతగాని పనిముట్టువలన గాని ఒకపనిని మాత్రము చేయగలము. అది ఒక విధమైన పనిని మాత్రముచేయుట-కేర్పడినది. యంత్రమన్ననో, అట్టి సాధనములు, వివిధములైనవి అనేకములుండి వివిధములగు పనులు చేయుసట్లేర్పడి యుండును. అదేలాగున చేయి, అనేక విధములగు పనులు చేయుటకు వీలుపడుచున్నది.

చేతివలన జరుగు పనులను కొన్నింటిని చూతము. పటము నందు కనుపడుచున్న కమ్మరి వానిని చూడుడు. వాడెట్లు సుత్తెను పట్టుకొనియున్నాడో గుర్తింపుడు. చేయి ఆ సుత్తె పిడి నెంత బలముతో పట్టుకొన్నది! భుజము గుండా వచ్చుచున్న కండరముల సహాయమువలన బొటనవ్రేలును తక్కిన వ్రేళ్లను వంగుచున్నవి. తరువాత చేయి భుజముపర కెత్తబడి ఎంత బలముతో దాగలిమీద పడునో చూడుము. ఇంత బలమైన పను

లను చేయు చేయియే, బహు సున్నితమైన పనులను చేయును. కంసాలులచేతులు ఎంత చక్కని నగలుచేయును! చేయి కలము పట్టుకొని వ్రాయును. మనుష్యుడు చేయు యంత్రములు, భారమైన పనులను, సున్నితమైన పనులను చేయులేవు. భారమైన పనుల కేర్పడిన యంత్రములు సున్నితపుపనులను చేయ లేగవు, గాని చేయివలన చేయబడిన ఈ యంత్రము ఎట్టి పనినైనను జేయగలదు. చేతిలో పెట్టబడిన ఆయా సాధనముల వలన ఆయావివిధములగు పనులు జరుగును. త్రాడు, సుత్తె, పార, గడ్డపార, కత్తి, ముల్లు, కలము, రాయి మొదలగు దానిని చేతిలో నుంచినయెడల, వివిధములగు పనులు జరుగుట చూడవచ్చును, చేతివలన జరుగు పనులను వ్రాయుట కంటె, పనులు జరుగునప్పుడు చేతిని కనిపెట్టుట వలన అనేక చిత్రపు సంగతులను మనము గుర్తింపవచ్చును.

చేయి పనులను చేయుట మాత్రమేగాక మనస్సునకు సంగతులను తెలుపు సాధనమునైయున్నవి. ఈ పనికిదిఎంతో తగినదై యున్నది. చిన్న వస్తువులను, సున్నని వస్తువులను అది తాకి చూచి తెలిసికొనును. కండ్లులేని గ్రుడ్డివారు ఉబ్బెత్తు అక్షరములను తాకి చూచి మనవలె గబగబ చదువగలరు.

భుజమునుండి అరచేతివరకు 30 ఎముకలును, దాదాపు 50 కండరములు గలవు, ఇవన్నియు నాడులచే మెదటితో

కలుపబడినవి. ఆయా జంతువులు చేతికి బదులుగా నేమి వాడుచున్నవో తరువాత పాఠములో చూతము.

---

## సంతోషముఖము

క్రీస్తును అంగీకరించినవారి ముఖమునందు ఆయన ప్రతిఫలించుచుండును. క్రీస్తు భక్తులలో ఒకరు ఒకసమయమున అనేక గాయములనుపొంది ఒక ఆసుపత్రికి తీసికొనిపోబడెను. అధిక శరీరబాధయున్నను ఆయన యెల్లప్పుడు సంతోషముగా నుండువాడు. ఒకదినమున తనకు పరిచర్య చేయుచున్న నర్సుకు క్రీస్తునుగూర్చి ఆయన చెప్పసాగెను. ఆమె తనకు అది అంతయు తెలియునని త్వరితముగ ప్రత్యుత్తర మిచ్చెను. అందులకు ఆ రోగి "నీకు తెలియునా? తెలియదనుకొంటిని. ఎందుకంటే నీ ముఖము యెల్లప్పుడు సంతోషముగ నుండదు. క్రీస్తును యెరిగినవారు ఎల్లప్పుడు సంతోషముగ నుండెదరుగదా!" అనెను.

---

"సంతోషహృదయము ముఖమునకు తేటనిచ్చును."

# బైబిలు పిల్లలు



అగ్నిలోబడి కాలకుండిన మువ్వురుబాలురు.

ఇశ్రాయేలీయులు దేవునిమరచి పాపముచేయుచుండినందున వారిని దేవుడు శిక్షించెను. వారు బబులోను దేశమునకు చెరకు తీసికొనిపోబడిరి. అచ్చట వారిలో కొందరు [illegible]రు తెలివితేటలు గలవారుగా కనుబడినందున రాజు వారిని పెంపకమునకు తీసికొని వారికి వేరుగా రాజుగారు తిను అన్నపానములు ఇచ్చునట్లు యేర్పాటుచేసిరి. నాలు

ద్రాక్షారసముత్రాగ నిష్టపడక కూరగాయల ఆహారము మాత్రము కావలెనని కోరి అట్లు స్వల్పఆహారముపుచ్చుకొను చుండిరి. ఇట్లుండగా ఆదేశపురాజు ఒక గొప్పవిగ్రహమును చేయించి తన ప్రజలందరు దానికి సాగిలపడి మ్రొక్కవలె నని ఆజ్ఞాపించెను. అందరు రాజాజ్ఞప్రకారము చేసిరిగాని ముగ్గురు బాలురుమాత్రము ఆ విగ్రహమును సేవింపరై వారెవరో మీకు తెలియునా? వారు షద్రక్, మెషక్, అ ద్నగో అను భక్తిగలబాలురు. రాజుగారికి వీరు తన విగ్రహ మును మ్రొక్క సమ్మతించుటలేదని తెలిసినప్పుడు మండిపడి, అచ్చట తన ఆజ్ఞప్రకారము మండుచున్న పెద్ద నిప్పులగుండ ములో ఏడురెట్లు అధికము మంటపెట్టించి నిప్పులు ధనధన పెద్ద మంట మండుచుండగా వారి ముగ్గురిని త్రాళ్లతోకట్టించి కొందరు సేవకులతో వారిని ఆ నిప్పులగుండమున ద్రోయుడని చెప్ప వారు అట్లు చేసిరి. వారు పడవేయుచుండగా ఆ మంటలో పడవేసినవారికి నిప్పుసోకి వారి వస్త్రములుకాలి కొందరు చచ్చిరి. ఏమిచిత్రమో గాని ఆ ముప్వ్వరుబాలురు నిప్పులలో పడద్రోయబడినను కాలకయుండిరి. వారు బాగుగా కాలిరని తలంచిచూడగా అట్లుగాక బాగుగాతిరుగుట చూడబోయిన వారు కాంచిరి. మరియు మరియొకరు వారితోకూడ తిరుగు చుండుటయు కనిపెట్టి, రాజుగారియొద్దకు పరుగెత్తి కొందరు

సంగతి తెల్పిరి. అంత రాజు ఆశ్చర్యముతో వచ్చిచూడగా వారు చెప్పినట్లే యుండెను. రాజుగారు వారిని పెద్దగా పేర్లు బెట్టిపిలిచి బయటికిరండని చెప్పగా వారు తిరిగి బయటకు వచ్చిరి. వారి వస్త్రములకు కొంచెమైనను నిప్పు అంటనేలేదు. అప్పుడు రాజుగారు తన ప్రజలతో నేను మ్రొక్కుడని మీతో జెప్పిన ఈవిగ్రహమునకు కాదుగాని షద్రక్ మెషక్ అబె ద్నెగోలు సేవించే నిజదేవునినే ఇక మనమందరము సేవించవలెనని ఆజ్ఞాపించెను. బాలమిత్రులారా! చూచితిరా ప్రభువు తన్ను నిజముగా సేవించువారిని అగ్నిలోబడి కాలవలసి, వచ్చినప్పుడు ఆ భయంకరమైన మంటనుండి తప్పించి రక్షించెను. మనమును ఆ ముగ్గురుబాలురవలె నిజదేవునినే సేవింతము.

---

“నీతిమంతుని నోరు జీవపు ఊట.
భక్తిహీనులనోరు బలాత్కారము
మరుగుపరచును.
పగ కలహమును రేపును.
ప్రేమ దోషములన్నిటిని కప్పును.”

# బాలమిత్ర టపా




ప్రియ బాలమిత్రులారా!

నేను మూడు సంవత్సరములనుండి బాలమిత్రను చదువు చున్నాను. దానిని చదువునప్పుడెల్లను నా హృదయమునందు విశేషసంతోషము కలుగుచున్నది.

ప్రియ సహోదరులారా! నేను కమ్మమెట్టు సి. యం. యస్. మిషనుస్కూలునందు ఏడవతరగతి చదువుచున్నాను. మా బడిలో రెండవతరగతి మొదలు ఏడవతరగతి వరకు ఉన్నది. మా బడిలో 75 మంది యున్నారు. నేను దోర్నకలులో

నాలుగవతరగతి వరకు చదివి దోర్నకలు అధ్యక్షులవారివలన కమ్మమెట్టుకు పంపబడితిని.

ప్రియ సహోదరులారా! నాకు తలిదండ్రులు లేరు గాని దేవుడు నన్ను బాగుగానే పోషించుచున్నాడు. నాకు తలిదండ్రులనుగూర్చి చింతవచ్చినప్పుడు దావీదు కీర్తన 27: [illegible] వ వాక్యముద్వార నాకు నేను శాంతపరచుకొందును. బడిలో దినమొక పర్యాయము బైబిలు నేర్పబడును. మరియు ఉదయము వేదవాక్య సమాజపు కార్డులో వ్రాయబడిన ప్రకారము చదువుదును. దానిలోనుండి ఒక వాక్యమును దాని పోలిన మరియొక వాక్యమును మరియొక పుస్తకమునుండి నేర్చుకొందును.

ఇప్పుడు దోర్నకలులో ఒక ఆడపిల్లలబడియు ఒక మగపిల్లలబడియు ఒక బైబిలు ట్రేనింగును యున్నవి. ఆడపిల్లలబడియందు 30 మందియు, మగపిల్లలబడియందు 37 మందియు, బైబిలు ట్రేనింగునందు 14 గురును ఉన్నారు. మరియు వడ్లపని, నేతపని, వ్యవసాయము మొదలైన చేతిపనులుకూడ నేర్పబడుచున్నవి. కమ్మమెట్టునందు ఆరుగురు ఉపాధ్యాయులు గలరు.

ప్రియ బాలమిత్రులారా! కమ్మమెట్టు, మానుకోట, పాలంచ, పాకాల, ఎల్లండు తాలూకాలద్వార మొదలగు తాలూకాలకు ఇద్దరు మిషనెరీలను పంపినారు. అక్కడ దేవుని కృపచేత బాగుగానే పనిజరుగుచున్నది. దాని నిమిత్తము కృపగల దేవుని ప్రార్థించుడి.

బాలమిత్రను చదువు బాలబాలికలారా! మీకు ని…మించబడిన పనిని మీరు నమ్మకముగా చేయుచు ఇతరుల ప్రయో…జనముకొరకు నేనున్నాను అని తలంచి కృపగల దేవు…యందు భయభక్తులు గలిగియుండుడి. మీ కందరికి నా ప్రియ వందనములు.

ఇట్లు మీ ప్రియ బాలమిత్రుడు,
కుమ్మరి యోహాను,
వరంగల్లుజిల్లా మానుకోటతాలూకా, దోర్నకల్లు.

యౌవనస్థుల బలము వారికి అలంకారము.
తలనెరపు వృద్ధులకు సౌందర్యము.

C. L. S. PRESS, MADRAS—1‥3